శ్రీ రస్తు.

# ప్రహ్లాద చరిత్రము.

## హరికథ

విజయనగర వాస్తవ్యులును, మహాకవిగాయక శిరోమణులును
గానవిద్యా విశారదులును నగు
బ్రహ్మశ్రీ మాదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారిచే
రచియింపఁబడినది.

ప్రకటనకర్త:
కురుకూరి సుబ్బారావు,
సరస్వతీబుక్కు-డిపో,
బెజవాడ, కృష్ణాజిల్లా.

రెండవకూర్పు 1000.

బెజవాడ వాణీముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడెను.

1929.



వెల రు. 0—8—0.

# ప్రకటన



1929 సం॥ రం ఆగస్టు 23 తేదీన బ్రహ్మశ్రీ మదజ్జాడాదిభట్ట నారాయణదాసుగారిచే రచియింపఁబడిన

హరికథలు.

1 జానకీశపథము. 2 రుక్మిణీకల్యాణము. 3 మార్కండేయచరిత్ర 4 హరిశ్చంద్రోపాఖ్యానము. 5 అంబరీష చరిత్ర. 6 భీష్మచరిత్రము. 7 ప్రహ్లాదచరిత్ర. 8 గజేంద్రమోక్షణము. యీ ఎనిమిది పుస్తకములు సదరు గ్రంథకర్తగారివద్ద పై తారీఖున మేము కాపీరైటుపొంది కాపీ రైటు యాక్టుప్రకారం దస్తావేజు వ్రాయించుకుని రిజష్టరీచేయించుకున్నాము. యీ పుస్తకములు ఇండియా కాపీరైటుచేతను పరకీయమైన కాపీరైటుచేతను సురక్షితమైయున్నవి. మాఉత్తర్వు లేనిదే యెవరైనను ఇందులో ఒకభాగముగాని సంపూర్ణభాగముగాని ఇందులోని భావములుగాని కీర్తనలుగాని యీపుస్తకములు భాషాంతరీకరించి క్రయమునకు యిచ్చుటకుగాని యెవరికిన్ని హక్కులేదు. యీపుస్తకములను యేమాత్రము కాపీ చేసినయెడలను కాపీరైట్లను నుల్లంఘించినట్లగును. అట్టివారు మేము జరపబోవు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురు.

–8—29.

ఇట్లు,
కాపీరైట్లు హక్కుదారుడు,
కొరుకూరి సుబ్బారావు,
సరస్వతీబుక్కు డిపో,
బెజవాడ.



శ్రీ రామ

# ప్రహ్లాదచరిత్రము.

శా. త్రైలోక్యంబులు పుట్టునిల్పు మఱియంతంబందు నీచేతనో ।
నాళీకప్రియ తేజభాస్కర జగన్నాథా సదారోగ్యతన్ ।
వాలాయంబు శ్రితాళికిన్ సలుపు దైవంబా మదిన్ గొల్చెదన్ ।
లీల న్నీయవతార మాయరసవల్లిన్ సూర్యనారాయణా॥

గీ. కడుదురాచారవంతుఁడఁ గాన నేను
నిష్ఠతో నీవ్రతము సేయ నేర నిన్ను
వక్ష్యమాణంబునకు కృతిపతి గొనఁదగ
గరుణ నంగీకరించు మో కమలమిత్ర॥

శుద్ధసావేరి - మిశ్రగతి.

ప॥ అరసవల్లి సూర్యనారాయణా - ఆర్తపోషణా - వేదపారాయణా॥
అనుపల్లవి॥ స్ఫురజ్జగద్దీప త్రిమూర్తిస్వరూప । సరసిజమిత్ర - భాసు
రలోకనేత్ర॥

మి॥ పరమపురుషా పరంధామ - ప్రతిదిన ప్రత్యక్షదేవత । నిరత సంశ్రిత
సౌఖ్యదాయక - నిఖిల చరాచరాధినాయక॥ అర॥

చరణం: ౧ సతతోషాపద్మినీ - ఛాయావిహార - సత్యా[illegible] - జన
మందారా । అతులకల్యాణగుణాకరదినకర - అప్రమేయ దివ్యా-
యానందమూలా । వితతసంసారాబ్ధినౌకా - శ్రీకవిర్వహ నిమగ్న
లోకా । నతవిలోలా పతితపావన - నారాయణదాసావన॥ అ॥

కాంభోజి - చతురశ్రగతి.

ప॥ గణనాయకా విఘ్నము సేయకు రా—

అ॥ ఫణిపతిభూషా - భక్తసంతోషా । ప్రతిపూలుకొందు రా వినాయక॥ గ॥

౧ కనికరమున నా - కావ్యము పూర్ణముగ - కొనసాగించుము రా - వినాయక । మునుముందుగ నీకు - మ్రొక్కుచున్న నే - వనినొ వేరదు రా॥ గ॥

గీ॥ కుడుములుం(డాళ్లు మెక్కుచు గుజ్జువేల్ప
చిన్నదయురమున పాపజన్నదము దాల్ప
మూడుమూర్తులకుం బెద్దు మొదటిఘార
లోపమెంచకు మారి యొలుకసవార॥

వసంత-చతురశ్రగతి.

ప॥ ప్రోవుమా సర్వరాణి నిను - భావింతునే నీలవేణి - సుశ్రోణి॥

అ॥ గ్రీవాక్షి విజితదర్పైణి - కీర్తనీయ మృదుపాణి ఓవాణి॥ ప్రో॥

౧ నీచెల్మితో సరియొన్న - నిఖిలలోకములందు వెదకినసున్న నీచెట్ట బట్టుము చన్న - నాచింతద్రిప్పు మొకసారి నీకడకన్ను॥ ప్రో॥

౨ వినగనీపేరెంత శ్రావ్యము - కొనసాగించుము నాకావ్యము । నవబోధ శోకవిధ్వంసిని - నారాయణదాసపాలిని॥ ప్రో॥

క॥ నీవేమూలము సుమ్మీ
భావింపగ జగములకును బ్రస్తుతిబొందన్
గావున మదిమరి వేడెద
నోవాణీ కరుణజూడుమో పూబోణీ॥

గీ॥ పూర్వకవులందరున్ గడుపూజ్యులందు
భాగవతులయి గోస్వామి కములగను
కృతులొనర్చినధికుల సంస్కృతమున జయ
దేవు దెనుగున బోతనం ౨ దెలిసి యెంతు॥

---

౧ గీతగోవిందకారుడు.

౨ శ్రీమదాంధ్రభాగవతకారుడు.

సీ॥ పూర్వ ప్రబంధము పోల్కికై వచ్చిన
యీగనంటించెడు హీనుడొకడు
ప్రౌఢకల్పనలని పన్ని తనకు దాని
యర్థంబెరుగ లేని వ్యర్థుడొకడు
కృతిని నిఘంటువు వెతకి ముదురు
తాటిమాంజనలెన్నేయు మూర్ఖుడొకడు
తేట తెల్లంబని తెన్గుబాసకు బట్ట
తెరచిచూపించెడి దేబెయొకడు
గీ॥ కలివశంబున శారదకలుషయయ్యె
బిదపకాలంబున దలంపు పిచ్చియయ్యె
అచ్చు చవకయ్యె మూఢులు మెచ్చుటయ్యె
నహహా యెందుకు కవులైరి యాధునికులు.

సీ॥ ఘనశంఖమో యన కంఠంబు పూరించి
మేలుగా శ్రుతిలోన మేళవించి
నియమంబు తప్పక నయ ఘనంబుల
బెక్కు రాగభేదంబుల రక్తినలిపి
బంతు లెగిర్చిన పగిది గాలజ్ఞర్క జాతి
మూర్ఛనలొప్ప స్వరముబాడి
చక్కని నృత్యముల్ సత్వరసానుకూ
లంబుగ నభినయనంబు జేసి
స్వకృత మృదుయక్షగాన ప్రబంధ సరణి
వివిధ దేశంబులన్ బిన్నపెద్దలు గల
బలు సభల హరిభక్తి నుపన్యసింప
లేని సంగీతకవితాభిమాన మేల.
క॥ అని యిష్టదేవతా ప్రా
ర్థనమున్ సత్కవి బహూకరణమున్ గుకవి
ధ్వనిమాత్ర నిరసనము సే
సి నవీనాను ప్రబంధశేముషి నుండన్.

గీ॥ వేడ్క నానేస్తుడగు బొడ్డు వెంకటేశ
మనెడు విదురుని బోలిన యంఘ్రిజుండు
విజయనగరనివాసుండు వినయమొప్ప
మ్రొక్కి నాతోడ బలికె దానొక్కనాడు.

సీ॥ సంస్కృతంబున గృష్ణజననము తెనుగున
నంబరీషచరిత్ర మలగజేంద్ర
మోక్షణమున్ ధృవభూపతిచరిత
మార్కండేయు చరితము మనసుదీర
సత్యహరిశ్చంద్ర చారిత్రమున్ రుక్మి
ణీపరిణయముల నేర్పు మెరయ
గాన ప్రబంధముల్ గావించి హరికథా
రూపకోపన్యాస రూఢిమీరి
భళిర నీవలె బండిత పామరులను
బెక్కుదేశంబులన్ రక్తి జొక్కజేసి
గాన కవితాప్రతిభజూపు ఘనుడుగలడె
తథ్యధుర్య నారాయణ దాసవర్య.

గీ॥ పద్యకావ్యమనందగు బాటసారి
గరిమ సారంగధర నాటకంబు మొదలు
గాగ నెన్నియో చెప్పితో గ్రంథములను
మరియు ప్రహ్లాదచరితము మరువనేల.

క॥ అని జ్ఞాపకంబు తెచ్చిన
యనుంగు చెలికాని బుద్ధి కౌరా యని గొ
బ్బున ప్రహ్లాదుచరిత్రము
వినుపించెద నిటుల బిన్నపెద్దల కెల్లన్.

హంసధ్వని - చతురశ్రగతి.

ప॥ వినుడీ ప్రహ్లాదుని - చరితము మీరా - వీనులవిందుగను - ముందు
గను॥ వి॥

అ॥ మును పాకశాసనుని జంపిన క్రోధమున । వనజాక్షునిపై - వైరము బూనె - హిరణ్యకశిపుండు॥ వి॥

౧ ఒకనాఁడా జగజెట్టి చెలగి పేరోలగమందున - దుఃఖమున । ప్రకటాసురమంత్రులతో ననియెఁ । బరితాపము గోపమునీరగ నిటు॥ వి॥

౧ సింహేంద్రమధ్యమ - త్రిపుట.

ప॥ ఎంత ఘోరపు వార్త విన్నబడె - నేమి సేతు మంత్రులార॥ యెం॥

అ॥ వింతపందిగవచ్చి విష్ణుం - డంతమందించెనట నాతమ్ముని॥ నెం॥

మి॥ చింతాంబుధి లోపలమునిగి - జీవించుటెటు నాతల్లిదితి । పంతగించి యాహరిపై నే - బగసాధించుకొనక మానుదునా॥ యెం॥

౧ పదునెనిమిది యేండ్లవాడు - బాలుడు నాసోదరుండు భర్మాక్షుడు శౌర్యధనుడు శత్రుభీకరుడు । కదసిపెద్ద గదతోన - కదనమ్మునకు బూన - నెదిరింపగా దరమాన - యీశ్వరునికైన । పదపడి సిగ్గుల్ బోడుల్చి - పాడుపంది వేషము దాల్చి । తుదకిట్లు జేసెనంట - తోయజాక్షుడింత దొంగబంట॥ యెం॥

సీ॥ నీలికొండల్ కోలు నెమ్మేన దొగరుదు
ప్పటి సంజకెంజాయ పగిది మెరయ
స్వప్రతాపానలజ్వాల లనంగ నా
దలమీరి పల్లజడలు వెలుంగ
నఖిల జగజ్జయ ప్రాప్తకీర్త్యంకు
రాకారత నెలవంక కోరలలర
నోలి ముప్పిరిగొన్న యుక్కుగదతోం బ్రమ్మ
లనదగు చేతుల బెద్దగద చెలంగ
ధరణియడుగుల కదర నమరులు బెదర
దిక్కులన్ గెల్చి వచ్చెద దీవనలిడు
మన్న। యువి నాకు మ్రొక్కి స్వర్ణాక్షు డేగె
దనుజుని మ్మళ్ళగన నోచనైతి నకట.

మ॥ జలజాక్షుఁ గడతేర్చుకున్న నిది మీసంబా తపంబూని ని
శ్చలభక్తిఁ వనజాసనుఁ దనిపి యిష్టంబంది నేవత్తు మీ
రలు దేవేంద్రుడు చేరకుండ నగరిఁ రక్షించుడీ యంచు శౌ
ర్య రసావేశముతో హిరణ్యకశిపుం డంతస్వనిన్ బొందగ॥

మంజగతి - భైరవి.

౧ జగజెట్టియు సకలమాయా విదుం - డగు హిరణ్యకశిపుండు
నగరము విడచిన సందుజూచుకొని - పగబట్టి సురేశుండు।
౨ త్వరితంబుగ జనిమాయారూపున - హిరణ్యకశిపుని యాలిన్। బ
రమ పతివ్రతామణి న్నిద్దుర - బరగు నిండు చూలాలిన్।
౩ బాపమవక చెరబట్టి స్వర్గమున - కై పోవగ నడుమంతఁ । ఆపె
మేల్కాంచి తనయవస్థన్ గని - యపుడేటు లేడిచెవింతన్॥

శుభపంతువరాళి—మిశ్రగతి.

ప॥ ప్రాణనాథయో - రాక్షసేన్గొనన్ను - రక్షించుటకు వేగరారా।
అ॥ హీనుడొకడు న- న్నిట్లో చెరబట్టి - యేగుచుండె జూడవేర ॥ప్రా॥
౧ నిదురించుచున్నట్టి - నిండు చూలాలనన్ని - నీచుండు కొంపోవనేల।
కదసి యీదుష్టుని - ఖండించి త్వరగాన - గావిచేకొనుమ
యీవేళ ॥ప్రా॥
౨ అయ్యయ్యోనా మొర । యాలించుటకునొక్క - డైన వేలువుగా
నరాడా । చయ్యన నను బట్టి - సాగదమాగని - జంపుమా
జగజెట్టికాడా ॥ప్రా॥
సీ॥ ఓరిపాపాత్ముడా యోదొంగవాడ నీ
కేమిలాభమురనన్నేడిపింప
నం జర గొనిపోకు నానగలన్నియు
నీకు నేనిచ్చెద నిజము వినుము
నిండుచూలాలను నేబతివ్రతనునా
కాంతుడకాంచనకశిపుడుజుమ

మరికొన్ని దినములు మనదలంచెద వేని
వేగమేనన్ని ప్రువిడిచిపొమ్ము
అకట విధికిగరుణరవంత యినలేద
పెంపుతోడుత నామొరాలింపరాద
కావరేకొండలార వృక్షంబులార
సూర్యుడా యాకసమ భూమి చుక్కలార॥

క॥ అప్పుడు నారదముని య
చ్చోప్పున కడ్డంబువచ్చి సురనాథునితో
నొప్పారుసీతివాక్కుల
జప్పున నసె నప్పొలంతి సంతసమొందన్॥

3 సరసాంగి — చతురశ్రగతి.

ప॥ ఓసురనాథా నీకిటుతగునా వినుమో॥
అ॥ ఈసుదతీమణి సాధ్వినుమా। వినుమో॥
చ॥ ఆసతోడ బురిజొచ్చిమాయివై — యీసరోజముఖినిందుగర్భిణో
ని।గాసి బెట్టి యిట్లీవుగ్రైకొనగ । మోసమవును విమువుము కూడ
దిటుల॥నో॥

౧ హా తెలిసెన్నీ కోరికెతెరగెద్దిమో॥ యాహా॥
ఈతరుణీసుతు జంపుటకై । నీతిశాలి హరిభక్తుడున్నడు - న్నిమహా
లాత్ముడును దీర్ఘజీవియమై । యీతలోదరికి బుట్టునభర్తను ఉడు -
నీవునెల్ల జగములు సంతసిలగ॥ నో॥

ఉ॥ పంతముతోడ నీవయిని బాముపలెన్నగ బట్టునుమ్ము దు
ర్దాంతుడు లోకకంటకుడు దానవభర్తన నిజాబుగా మహా
శాంతుడు విష్ణుభక్తుడును సన్నుత శీలుడు బుట్టుదీని కి
యింతి కతంబు నీ హితముకై యని నారదుడిట్లు సెప్పినన్॥

గీ॥ అప్డు దేవేంద్రుడు న్మంచిదనుచు గనక
కశిపుభార్యను విడనాడి కడుముదమున.

నాకపురికేగెనంతట నారదుండు
జనియె దనయాశ్రమమున కా సాధ్వితోడ॥

క॥ సృష్టిస్థితిలయ కారణ
యిష్టార్థప్రదా మహేశ్వర సకలా
రిష్టాప హారణకరుణా
వష్టబ్ధాదార్ద్ర యరసవల్లీ నూర్యా॥

మాలిని॥ నతమిథున సుసంతాన ప్రదాన ప్రకాశా
ద్యుతిసముదిత మార్గా వ్యాప్తసత్పద్మకోశా
సతతభువనబంధూ సర్వలోకప్రణాశా
క్రతుహవిరనుభోక్తా కర్మసాక్షీ దినేశా॥

గీ॥ అవధరింపుము వేయిదివ్యాబ్దములను
ఘోర తపమాచరించి తాగోరుకొన్న
వరముల బ్రహ్మచే బొందిమరలి వచ్చి
హేమకశిపుండు మంత్రులకిట్టులనియె॥

౨ నాటక్రియ—రూపకము.

ప॥ మీకంత నేమమా! నాకోర్కె దీరివచ్చితి॥ మీ॥

అ॥ నాకుమించిలోకములను । నాథుడెవ్వాడింక లేడు । వైకుంఠునిజంపెదనింక । నిక్కంబిక॥ మీ॥

చ॥ నాకములో భువిలోనే - లోకములోనైననన్మరి । నాకుబ్రహ్మసృష్టిచేత నాశమే లేదహహా॥ యం॥

౧ నరులచేతనైన గి - న్నరులచేతనైన వానరులచేత సురలచేత - నాగ నభశ్చరులచే । నిరతము స్థలచరజలచర - నిఖిలజీవకోటిచేత । మరి శస్త్రాస్త్రములజావ - మావున్నవలె న్నిజముగ॥ నం॥

గీ॥ అజుడు నేకోరిన వరంబులన్నియిచ్చె
నెల్లజగముల నాకిక నెదురు లేదు
మిగుల కృతకృత్యుడనటంచు మిన్నుముట్టు
స్వర్ణకశిపునకు నమ్మంత్రి సంఘమనియె॥

.. ౫ గౌరీమనోహరి - చతురస్రగతి.

ప॥ అకటా యేమిచెప్పుదుమయ్యా । యధిపామాకునోరాడ॥ ద॥
అ॥ అకలంకగుణా - యయ్యోనీగృహిణి । యగుపడదదే - మయ్యోనో
తెలియ। మ॥
చ॥ ఇకనేమిచెప్పగలిగెదము పోతు - టీగకైన జొరశక్యముకాని । ప్రకటదనుజ పాలితాంతఃపురము - పరికింపనేమొ శూన్యమయ్యో॥ న॥

గీ॥ పదిదినములయ్యెగాన మప్పరమసాధ్వి
యేమియయ్యెనో రక్కసులెల్లదెసల
వెదకుచున్నారు కలవార్త వినికిలేదు
అకట యికనేటిసేమమో యసురవర్య॥

గీ॥ ఇట్లుమంత్రులు జెప్పగ నేపుదరిగి
రేత్తవడి హేమకశిపుడు తత్తరిల్లి
వేడినిట్టూర్పు నిగుడించి వెలదికొరకు
నెడదనీరయి యిట్టులనదరజొచ్చె॥

౬ రామప్రియ .. చతురస్రగతి.

ప॥ ఏమైతివో ప్రాణేశ్వరినీ॥ వే॥
అ॥ నామనోహారిణి । నన్నొంటిగ చేసి॥ యే॥
చ॥ నేమరిగననానిను దీయని- నీవడివిననా । కామినీమణీ పూర్ణగర్భిణివి - గదే పాడువిధియెంతజేసె॥ నే॥
౧ ఈవులేనివార్త - కెటెన్నైచునీభర్త । యేవిధానబోతి - వెటుల మాయమైతి । దేవిపక్కవే నీవాతెర - తేనెజిక్కవే । రావదేమిత్వర గనీకొరకునీ - ప్రాణనాధుసిటు లెదురుచూడ॥ నే॥
వ॥ అకటా యొభువనైక సుందరి యొహో ప్రాణేశ్వరీనిన్నుగా నక నే నొక్కక్షణంబునిల్వగలనా నన్బాసి నీవోర్వకిం తకు వైరాగ్యముపూని బ్రహ్మమున లీనంబైతివో లేక వంచకుడై మాయమొనచేనో హారినినున్సాధ్వీమ రేమైతివో ॥

గీ॥ స్వర్ణకశిపుడిట్లు జాలినిగుందగ ౨
గగనగమన మొప్పగా ముదమున
దనుజనాథు దేవిగొనినారదుడువచ్చి
మెరుపుతోడివెల్ల మేఘము వలె॥ ౩
గీ॥ పుట్టు తనయుని జంపనీపొలతి నమర ౪
భర్తగొనిపోవ నేనడ్డుపడివదల్చి
యింతకాలము నీసాధ్వి నేనుగాతు ౫
ననగ దనుజుడు మునితోడ ననియెనిట్లు॥

చారుకేసి - త్రిపుట.

ప॥ తెలిసెతే యీమోసకారి - దేవేంద్రుడు చేసిన పనియిదా॥ తె॥ ప
అ॥ నెలతగను కొమరునిన్ జంపగ - నెట్టుకొనియె నదెంతద్రోహియో। తె॥ అ
చ॥ పులిమీసములు బెరుకునట్లు - శలభమగ్గిలో బడునట్లు। బలుతాచు చ
న్మ్రొద్దిడునట్లు - నలిపెగీడు నాకాయధముండు॥ తె॥
౧ నేటితో స్వర్గము పనిసరి॥ నిఖిలదేవతల పనిసరి। మీటిదిక్కుల ౧
నేలగల్పెద - మేరువకు దల్క్రిందుసల్పెద। సాటియెవరు నాకిజగము ల
నేటికిక జాలము సేసెద। చాటించుడు నాజయభేరి - మేటిబ్రహ్మాండ
మెల్ల పగులగా॥ తె॥
మ॥ భళిరా యెంతటి గుండెదీసిన పని న్బాకారి పాపాత్ముడై సీ
సలిపెన్నారద యాత్మబంధుడవు నాచర్మంబు నీపాదర
తులుగా వించిన నైన నీఋణము నాశక్యంబె తీర్పంగనం
చొలయుచ్ర్మొక్కిన సంతసిల్లి చనియె న్వృద్ధాశకుండంతటన్॥
మ॥ గులికన్బోయిన ప్రాణముల్మరల గైగొన్నట్టు మానీంద్రుచే
గలికిన్ బొంది వినోద వారినిధి మగ్నంబైన డెందంబుతో
జెలియన్వాయిగ గోటలోనిడి సునాసీరాది దిక్పాలురం
జలితోగప్పముగట్ట జేసిమరి రక్షస్వామి యేతేరగన్॥
ద్వి॥ అంతగొన్నాళ్ల కాయసురేశుకాంత
సంతతసకల సజ్జనుత్స్వాంత

౨ గరితవేయేఁడులు గర్భమ్ముమోసి
చిరుతని గనెనెల్ల చింతలుబాసి
౩ స్వర్ణకశిపుఁడును జాలమిన్నందె
పూర్ణమోదము జగములకును బొందె
౪ అరిగి శుక్రాచార్యు డబ్బాలుగాంచి
పరగనాతని పేరు ప్రహ్లాదుడనియె
౫ బిడ్డడు నానాట బెరుగుచునుండె
జడ్డివేల్పుల నోము సంపదపండె॥

౮ కీరవాణి — త్రిపుట.

ప॥ గణింపగ బ్రహ్లాదుని । ఫణీంద్రునికైన శక్యమా।
అ॥ గుణాకరుఁడా బాలుని ను - గుణంబు లనేకములుగలవు॥ గ॥
చ॥ వినయంబున బెద్దలగాంచు । గనికరమున దీనుల బెంచు । నన
యంబు నిగర్వతమించు - నన్యకాంత దల్లిగనెంచు॥ గ॥
౧ కలనైన నవ్వులకునైన । గల్లపల్కుట కొల్లడు।
కులవయో సౌందర్య బలవి । ద్యలనుగల్గియు ద్రుళ్ళడు । పలుమరు
సాధులతోఁగూడు - వ్యసనంబులకు దానోడు । వెలయంగా విష్ణుని
బాడు - వెర్రియై తినటులనాడు॥ గ॥

సీ॥ ఇతరులమనసునొప్పించడే కరు
ణావిశిష్టుడు తనకెంత చెల్లియైన
జోద్యమునకు నయ్యుజూడడే ధృతిశాలి
పరకాంత దానెంత సరసుడైన
నఖిలజనంబుల కడకువ జూపు నే
విజ్ఞానితాదోర బిడ్డడైన
దెలియని యట్టుల దిరుగు నేతత్త్వవి
స్ఫూర్తి తాసర్వజ్ఞమూర్తియైన
వ్యసనముల కెదుర్చుక్క సత్యంపుమొక్క
యందపు తుదిమెట్టు తెలివికాట పట్టు

జ్ఞానభాగవతాగ్రణి దానవమణి
యజునకున్న క్తిసున్న ప్రహ్లాదునెన్న॥

౯ వకుళాభరణము-రూపకము.

ప॥ హరిభక్తుల ప్రహ్లాదుని - సరివారెందైనగలరా॥ హ॥

అ॥ పరికింపగ భూతభావి - వర్తమాన కాలంబుల॥ హ॥

మ॥ సరిగా గుడుచుచునైన - మరియే యవస్థనైన। స్మరించి మాధవు
పాదము - మరచు జగం బంతయు॥ హ॥

౧ హరిచింతా పరవశుడై - యతడేడ్చు నొకచోట। హరిభావనారూఢ
చిత్తుడై పాడు నొకచోట। హరికిదక్క వేరులే - దని నగు
నొకచోట। హరి యను నిధానము గంటి - ననియుబ్బు నొకచోట।
హరిహరి యనునొకచోట - నానందాశ్రువు లొల్క। నురుపులకలు
గన్నుమూసి। యూరకుండు నొక్కచో॥ హ॥

గీ॥ ఇట్లు విష్ణుభక్తి మట్టుమీరగ లోక
మెరుగ లోక వైరి యెత్తినట్లు
తిరుగు సుతుని మనసు దిద్దుటకై యెంచి
కనకకశిపు డతనిగాంచి యనియె॥

౧౦ ధేనుక-త్రిపుట.

ప॥ చదివించెద గురువు నొద్ద। చదువుకోర నాతండ్రి॥ చ॥

అ॥ చదువనివాడు మూఢుడై చెడు। జదువ సదసద్వివేక మొదవు॥ చ॥

మ॥ పదపడి నేగెల్చిన జగముల - వైభవ మొక్కింతయు జూడవు। వద-
లని మాంద్యముతో నంధుని - వలెలోకమెదోయెరుగవురా॥ చ॥

౧ సాటిబాలుర తోడగూడి - యాటాడ వే కోర్కెగోరవు। మేటిశస్త్రా
స్త్రములు గల్గిన - చోటముచ్చటకైననుండవు। నీటుగ నలంక
రించుకొనవు - నెరతనమున హాస్యములాడవు। మాటాడవు కల
కల నవ్వి - మరివేరి వానివలె నుందువురా॥ చ॥

సీ॥ గాఢపోలిక రెట్టిగావించెడి నైజ
మగు తెల్వి దీపంబునంటి విద్య
చెడుగుణంబుల నెల్ల శీఘ్రము ఖండించి
మంచి గుణంబులు గావించు విద్య
కష్టకాలంబున గడునొంటి పాటున
నుల్లము నోదార్చుచుండు విద్య
విద్య శాశ్వత సత్కీర్తి వెలయజేయు
నిహపరంబుల విద్య తరింపజేయు
విశ్వమంతయు నడిపించు విద్యగాన
విద్య నేర్పుము వేగ నా వెరితండ్రి॥

మంజరి - ధన్యాసి.

౧ అని చెండామర్కులను గురువులకు - నప్పగించె నబ్బాలున్
గనకకశిపుండు సుముహూర్తంబున - గంజాక్షు భక్తిలోలున్
౨ ప్రహ్లాదుని గురువులు చదివించిరి - గ్రంథంబుల గొన్నిటిని
నాహ్లాదమ్మున సూక్ష్మబుద్ధి యత - డప్పగించె నన్నిటిని
౩ అంతట గొన్ని దినంబులు గడువగ - నసురభర్త మదిలోన
భ్రాంతుండేమి పఠించెనో చూడగ - వలయు ననుచు దలపూన
౪ గురువునొద్ద నున్న సుతుఁ బిలిపించి - కోరిక యువ్విళ్లూర
నరుదుగ దొడలందిడుకొని ముద్దిడి - యనియె న్వేడుక మీర॥

౧౧ కోకిలప్రియ - చతురశ్రగతి.

ప॥ ననుగన్న తండ్రి పలుకర - తనయా నాతోడ ॥న॥
అ॥ తనయాలాపము గదా - జనక శ్రుతి భూషణము ॥న॥
చ॥ అనుదినమును సంతోషణము । జనితశ్రమ సంశోషణము
వినుతోల్లి సలుపు జపఫలమా - ఘనదానవ కుల జలధిశశీ॥ న॥
గీ॥ అనుచు జెక్కిలి ముద్దిడుకొనుచు గౌగ
లించుచును జంచుదువ్వుచు నెద్దినీకు

భద్రమై యున్నదిప్పుడు పల్కుమనగ
జనకునకు సర్వవేత్తయా తనయుడనియె॥

౧౨ షణ్ముఖప్రియ - ఆది

ప॥ వినుదనుజకుల మణీవిశదముగ వినిపించెద నాకుదోచినమంచి ॥వి॥
అ॥ గనుమెల్లదేహ ధారులకుని - ల్లనుచీకటిపాడు నూతిలోప
లను గూలక మీరుమేమను మతి - భ్రమణంబున భేదబుద్ధిలేక॥
చ॥ అనయంబును సర్వము విష్ణుమయం - బనియాత్మనియందుల్లము జేర్చి
వనమందుండుట మేలని తలచెద - ననుమానముడిగి యాత్మా
రామత॥ వి॥
గీ॥ అనుచు దనకువ్విరోధియా హరిసమస్త
భూతమయుడంచు దద్భక్తిపొంది యుంట
యెల్లభంగుల మేలను పిల్లవాని
కిట్టులనెహేమ కశిపుడొకింత నవ్వి॥

౧౩ హేమవతి - రూపకము.

ప॥ ఇట్టిబుద్ధినీక డెట్టు - బుట్టెరా నావైరిపట్టి॥
అ॥ చెట్టగా మరెవ్వరైన - జెప్పిరా - నీకెతోచెన ॥యిట్టి॥
చ॥ కట్టాయాభాగ్యవులే - కాంతంబున బల్కిరా । బట్టబయలు
పగవాడ - వైకుంఠుని బొగడెదేల॥ ని॥
౧ సురకిన్నరనాగ ఖే - చరులను సృజించుటయో । గరుడయక్షవిద్యా
ధర - గంధర్వులగూల్చుటయో । మరిసిద్ధులగెల్చుటయో-
మానుల బాధించుటయో । హరిగిరియంచు న్గడుమో - హాం
ధుడవై చెడనేలర ॥యి॥
సీ॥ అనుతండ్రి మాటలు విని పురోహితునకు
నిట్లను బ్రహ్లాదుడింపుమీర
మోహనిమూలనంబున జేసియెవ్వాని
యెడల దత్పరులైన యెరుకగలుగు
పురుషులకున్దాముబరులను భేదంబు
తెలియబడదొయట్టిదేవుగొల్తు

నజ్ఞుల హోతమకన్యులకు న్భేద
మరసి సర్వాత్మకుడైనయీశు
జ్ఞానలభ్యునిగన్గొన జాలరైరి
యినుము సూదంటిరాతి చెంతనటుదిరుగు
నాహృషీకేశునంటుట కట్లుదైవ
యోగమున జేసి నాచిత్తమొగి భ్రమించు॥

ధర్మవతి - రూపకము

ప॥ హరినివిడిచి నామచిత్త - మన్యుల జేరుటెటుల శ్రీ॥ హ॥
అ॥ అరవిందము మానిమదన - మందు దేటి వాలునా శ్రీ ॥హ॥
చ॥ సరిగా మందాకినిలో - స్నానమూడు రాజహంస
బురదనక్క గుంటలోన - మున్గుట కాసించునె॥ శ్రీ॥హ॥
౧॥ మంచియూవి మానికోయిల - మరికొనిసెం జేరునా
ఘుంను వెన్నెల గ్రోలు చకోరము । మంచుగడ్డ కొరుకున శ్రీహ॥

మంజరి - ఆరభి

౧ అను ప్రహ్లాదుని ధిక్కరించి యిట్లనె గనకకశిపుతోడ
నానరబురోహితుడో యసురనాథ - యూరక సరిబడు వాడ
౨ కొడుకుగాడు నీకువీడు రాక్షస - కులమునకశ్శత్రుండు
కడు దానవాంతకుండైన హరి - గాదనక పొగడుచుండు
౩ నీతనయు నేము మంచిశిక్షల - నీతిపరుని జేసెదము
మాతోడబంపు మీతని కిబుద్ధి । మరి తొలగన్ద్రోసెదము
౪ అని బాలుని దనవెంట బెట్టుకొని । యుప్పురోహితుడు సెప్పె
ఘునపాఠంబుల నాతనికి గొంత । కాలము నీతులుమప్పె॥
గీ॥ ఇటుల నీతులబోధించి యెట్టకేల
కతనికింగల బుద్ధి ద్రిప్పితి నటంచు
నెంతయున్నద్మ్మ యప్పురోహితుడు సంత
సంబున నాక్షనేశ్వరుని సన్నిధికిని.

౧౫ రిషభప్రియ - త్రిపుట.

ప॥ ముందరికిఁ బ్రోసె దండ్రికి ౹ మొక్కుమని ప్రహ్లాదుని॥ ముం॥
అ॥ అందముగ దనతల్లిచేత నలంకృతుడై యున్నవాని॥ ముం॥
చ॥ డెందంబున నడ్డడునకు హా౹ రి దలంచి మైమరచువాని ౹ పొందు
గాను విష్ణుభక్తియే ౹ పురుషాకృతిగ నున్నవాని॥ ముం॥
౨ జనని గర్భముజొచ్చిన మొదలు ౹ శౌరిధ్యానము గల్గువాని ౹ సనసి
తనలో విష్ణుమయముగ నెల్లజగముం జూచువాని ౹ వినయకారుణ్యా
వివేకలక్షణాదిగుణముల కాటపట్టు ౹ యినవాని బుధలోకమాన్యుని
నేపున దనశిష్యుడగువాని॥ ముం॥

గీ॥ ఇట్లు ప్రహ్లాదు నప్పురోహితుడు హేమ
కశిపునకు మ్రొక్కజేసి యింకను బరీక్ష
జేసికొమ్మన దండ్రి యప్పిరుతవాని
దొడలయందుంచి ముద్దిడి నుడివె నిట్లు.

౧౬ లతాంగి - ఖండగతి.

ప॥ నాకద్భుతంబయ్యె ౹ నాతండ్రి చూడగను॥ నా॥
అ॥ నీకింత కాలంబు ౹ నేర్పెనది నీగురువు॥ నా॥
చ॥ ప్రాకటముగ నేర్చిన ౹ పద్యంబొకటి చదివి ౹ సాకల్యముగా వి౹
స్పష్టార్థము నుడువుము॥ నా॥
౧ నిన్ను మెచ్చరు చదువ నీతోడిబాలకులు ౹ అన్నిటి సమర్థులుగ ౹
దానీశుల౹ నెన్నడు నీతిగాని యీప్పుండువాయంచుగ ౹ గన్నారగ
ననుగొన ౹ నున్నాడ నాన్నా॥ నా॥

క॥ అని మచ్చికతో గురులన్
గొనగోళ్ళన్ దువ్వి ముద్దుగొను చెంతయు వే
డ్క నడిగినన్ బ్రహ్లాదుడు
వినుపించెను దండ్రికిట్లు వినయముతోడన్.

వాచస్పతి - త్రిపుట.

ప॥ చిల్లచదువులలోని మర్మము ౹ నేజెప్పెదను వినుము తండ్రి॥ ఎ॥
అ॥ కల్లగాందఖలశాస్త్రమ్ములు ౹ గలవు పెక్కులవన్ని యేల॥ ఎ॥

మి॥ ఎల్లవుకున్నఖ్యము కొండలుగ । నిలదొమ్మిది భక్తివిధమ్ముల ।
నల్లహరిన్ గొలువ భద్రం । బనద మనోవాక్కాయంబుల॥ నె॥

౧ చెలగు వెన్నెల గ్రుడ్డివానికి - చెవిటివానికి శంఖారావము । వెల
యు చదువులు మూగివానికి । వెలదుల నతినపుంసకునకు । చెలిమి
కృతఘ్నునియెడ హవ్యంబులు భస్మరాసియందున ।వలె వ్యర్థంబయ్యె
డు శ్రీహరి । భక్తిలేనివారల బ్రతుకుల॥ వె॥

చ॥ హరికి సమస్తకర్మములు నర్పణసేయకయున్నవాడు శ్రీ
హరి కథబల్కువాని దనయయ్యగ నెంచనివాడు ఘోరదు
ర్భర భవవార్ధి దాటు టెటు వానికి మోక్షము గల్గుటెట్లు పె
క్కురయగ నేల శాస్త్రము లహో హరిభక్తియె తండ్రి మేలగున్.

గీ॥ ఇట్లు శ్రీహరిభక్తి నుతించి తనదు
బుతుత పల్కెడు పలుకులు ములుకు లట్లు.
చిత్తమున నాట హేమకశిపుడు మండి
పడి పురోహితు జూచి యిబ్భంగి ననియె.

౧౭ నటభైరవి - ఖండగతి.

ప॥ ఔర మోసముజేసి - తాహో పురోహితుడా॥ యౌర॥

అ॥ వైరిభక్తినమ్మిప్పి । బాలకుని జెరచితివా॥ యౌర॥

మి॥ సారముగా నీతులు । జదివించక వీనికి భోయన హరికథలన్ ।
బోధించితె ఛీఛీ॥ యౌర॥

౧ అరయ స్వామిద్రోహ । మాచరించితి వీవు । ధరణి సురమాత్రు
డవు । తథ్యముగ విప్రుడవె। పరగ నధర్మంబున । వర్తించెడి మంత్రికి
దురితంబగు రోగము । మురికి వానికింబలె॥ ఔర॥

క॥ ఇటు విలయ కాల రుద్రుని ।
యటులన్ గ్రోధోగ్ర మూర్తియై దనుజుండా
భటి బల్క బురోహితుడు
గటకట బడియిట్లనియె గడువినయముతోన్॥

౧౮ ఖరహరప్రియ — రూపకము.

ప॥ తప్పులేదు మావలన దైత్య చంద్రమా వినుమ॥-త॥

అ॥ చప్పున మాపై నేరము । స్థాపించకు కోపించకు ॥కో॥

చ॥ ఎప్పుడు నీపామ్మేమ్మతిని । యిట్టిబుద్ధి చెప్పెదమా । యిప్పావనికిది నైజం । బింతయు నిజమోయప్పా ॥త॥

౧ అరయనీవురోహితుల । మదియుగాకభాగ్యవులము । ధరణిన్సత్యవ్రతులము । తలప నీకుశత్రులమా । కరప మితనికిట్టిబుద్ధి । మది యెవరున్మప్పలేదు । హరిభక్తి స్వభావమితని । కద్దుము నీనేచుకొలది ॥త॥

గీ॥ ఇటుల బల్కెడు నప్పురోహితుని యెడల
దప్పులేకుంట పరికించి తగదలంచి
సంశయాద్భుత కోపముల్సందడింప
దలను బరికించి యిట్లనె దనయుతోడ ॥

ఆభోగి—రూపకము.

ప॥ నీకు గురువు చెప్పనట్టి - నీతియెట్లువచ్చెరా॥ నీ॥

అ॥ వాకొను మరి యెవరు చెప్పిరో । వారి పేరు పుత్రకా॥ నీ॥

చ॥ ప్రాకటముగ వీరదనుజ । వంశజుండ వయ్యునీవు । వైకుంఠుని బొగడనేల । బనికి రానివాడ వగుచు॥ నీ॥

క॥ అని ధిక్కరించు తండ్రిన్
గని ప్రహ్లాదుండు పిన్న నవ్వొలయంగన్
ఘనవిష్ణుభక్తి ధైర్యము
బెనగొన నవుడిట్లు పల్కె వినయముతోడన్ ॥

మోహన—రూపకము.

ప॥ దొరకెనె హరిభక్తి । బొంది । తోడనే పుట్టకున్న । సురవైరి వినుము తండ్రి । చొప్పెరిగించెదను నీకు ॥దొ॥

అ॥ అరయ గృహవ్రతులై విష - యాసక్తినంధులై । సరిచర్విత చర్వణముగ । జచ్చుచు బుట్టెదు వారికి ॥దొ॥

చ॥ పరులు౯ జెప్పిన నైనం । బదపడితమయిచ్ఛనైన । మరియేభిచ్ఛనైనన్ । నరణ్యమున కేగియైన ॥దొ॥

౧ భళిర ప్రహ్లాదునిమాత । బట్టుకొన్న ప్రహ్లాదుఁడు । తలప నభీష్ట స్థలంబు । దాఁచేరఁగ లేని యట్లు । బలుకర్మ నిబద్ధులైన వార లెరుకతోడ విష్ణు । గలియరుకించనలోని - వ్యామూఢులైన భక్తులవలె ॥దా॥

౨ తనర శోధింపగాఁబడి । యెను సమస్త శాస్త్రములను । వినువెయ్యేటికిఁగాథలు । విష్ణుభక్తి నావలేక । పనివడి దుర్మేధన్గోని । పారము ముట్టఁగవచ్చునె । ఘనక్రోధలోభ మోహ । కారణ సంసారాంబుధి ॥దా॥

గీ॥ అనుచు బ్రహ్లాదుఁ డతి ధైర్యమునను విష్ణు
భక్తితత్పరుఁడై యిట్లు బల్క నోర్వ
జాలక హిరణ్యకశిపుఁడబ్బాలు దోడల
నుండి దిగఁద్రోసి మంత్రులనుగనియిట్లనె ॥

సూర్యకాంతము — త్రిపుట.

ప॥ వింటిరా యీపితృద్రోహి । పేడంబులు మీరెల్ల ॥ వి॥

అ॥ బంటుభంగి బినతండ్రిన్ జంపిన । పంపి నెట్లునుతించుచుండె నో॥ వి॥

చ॥ కంటిరె నాశత్రుపుత్రునకుఁ । గడువైరియని యెంచక యీతుంటరి హరి భక్తి మరిగినా । తోఁబగగొని చావబూనె నకటా ॥వి॥

౧ కొంచెమైన భయంబులేక। కుఱ్ఱఁడు తనతండ్రినైన నన్। వంచించి యిటుల నాపగి । వాని స్వర్ణించుచుండె మంచి తనమున బోధించినన్ । మానక పంతము బట్టెను నా। కెంచగబుత్రరూపమున జ । న్మించెన్ దుర్భర వ్యాధి యహాహా ॥వి॥

౨ అవయవంబుల నెముక గుల్ళిన యవయవము దెగగోసి మిగిలిన యవయవము రక్షించు వైద్యుని యట్లునే వీని । నవినీతుగుల ద్రోహు నధము । హరిపక్షపాతి జంపించి । ప్రవిమలంబు గావించెద మద్వంశము । వీరవ్రత విఖ్యాతిన్ ॥వి॥

క॥ అని యిటుల హేమకశిపుం
డనూన హరిచింత నామృతాస్వాదున్ ప

జనమోదుఁడ్ బ్రహ్లాదున్
మనుమాడగ బనిచెనపుడు దుష్టాసురులన్॥

శా॥ ఛాయాపాశములాధి నాథశ్రితరక్షాలోల మందేహదై
తేయారణ్య దవానలావిబుధ ముక్తిస్థాన సర్వామగ
ధ్యేయాపంక్తిగేయ వేదమయ భూతేశా సత్యసంచారప్రా
తేయాద్రి ప్రకటోదయా యరసవల్లీ సూర్యనారాయణా॥

పంచచామరము॥ సరోజమిత్ర లోకనేత్ర సాధుసౌఖ్యదాయకా
స్ఫురచ్చరిత్ర సత్యపాత్రభూరిదేవనాయకా
చరాచరాది కారణాయ సాధ్యరోగ మరణా
అరిష్టగర్వ తస్కరా సదార్సవల్లి భాస్కరా॥

గీ॥ చిత్తగింపుము హేమకశిపుడు తనదు
బాలుడా రక్కసులచేత బలువిధముల
నైన జావక యుండుట కద్భుతంబు
జెందితనలోన దానిట్లు చింతజేసె॥

చక్రవాకము-త్రిశగతి.

ప॥ కొంచెమైన జావడే - కుఱ్ఱడేమి హేతువా॥ కొం॥
అ॥ అంచిత తేజమ్మునదా । నంతకంతకు న్మీరెడు॥ కొం॥
చ॥ ఎంచి సముద్రంబున ముం । చించితిదావాగ్నింగా । ల్పించితి గ్రోలిం
చితి విష మేనుంగుల ద్రొక్కించితి॥ కొం॥
౧ అకిడి తెలియ బోకుజీవ । నౌషధంబు లెవ్వియైన । దరుగడు తేజో
బలముల దైన్యమొకింతయు బొందడు । వెరువడు దిక్కుల బారడు।
మరికంటనడి వెట్టడు । జొరడు శరణుతల్లికైన । నెరుగడు తన
దేహమైన॥ కొం॥
౨ పలుమరు నేజేయుబాధ । పరులతోడ దెలుపుకొనడు । తలపగ నా
యాగ్రహంబు । తనకనుగ్రహముగ నెంచు । కలుగదు నెత్తురు
మేనన్ । గందదు నొప్పియు దోచదు । భళిభళి యిచ్చిరుతనిదివ్య
ప్రభావమెట్టి తెలియము॥ కొం॥

గీ॥ పోల్చగావీడుదివ్య తపోబలుండు
గానజంపనసాధ్యుండు వీనితోడి
వైరమున జేసినాకు దప్పదు మృతియని
వెతబడు సురారికి బురోహితుడిటులనె॥

మంజరి- రేగు ప్తి.

౧ అకట యిట్లుజాలి దూలవలెనా । యసుర నాయకానీవు । సకలదిగీశ వ్రాతంబునొక్క । క్షణమున జయించినావు॥
౨ వీడనగ నెంత లోకంబులోన । నీడుముదిరినకోలది । వీడునన్నసహజ వక్రబుద్ధిన్ । వీడుగురు సేవనంది॥
౩ శుక్రాచార్యులు వచ్చునందాక । చూడు వీనిచేమనక । శక్రద్వేషణ బుద్ధి వీనికిన్ । నలుపు నాతండు గనుక॥
౪ చింతిల్లకుమని పురోహితుండున్ । శీఘ్రంబుగ బ్రహ్లాదున్ । అంతరంగమున్ ద్రిప్పవెంటగొని । యరిగె హరికథామోదున్॥

గీ॥ అంతనొకనాడు నొజ్జలు చెంతలేని
వేళ నాటలకున్నన్ను బిల్చుతోడి
బాలకుల గుంపుగూడిన యవ్వారితోడ
నలరి బ్రహ్లాదు డిటులుపన్యాసమిచ్చె॥

నవరోజు - ఆది.

ప॥ వినుడీ మీకొక మంచిచెప్పెదను - వివరముగ నేస్తులార॥ వి॥
అ॥ మనకుదగిన చదువు చెప్పకొజ్జలు మనల మోసపుచ్చుచుండెగాన॥ వి॥
మి॥ గనుచుంటిరె మనవంటి బాలకులు । దినదినమెటుకొందరుచచ్చెదరో గనుక నెరిగింతు సత్యమాదారి । ఘనశాస్త్రింబుల సారముదీసి॥ వి॥
౧ ధరమానుష జన్మంబు దుస్తరము । మరి పురుషుడౌట దుర్ఘటము। అరయ వాని కాయువు నూరబ్దము । లందునిద్రచే సగము చెరున్ బరికింపగ దక్కినసగమందున । బాల్యము గడచినపిమ్మటను । గరమును యౌవన కౌమారవార్ధక । క్రమములను దశలుమిగులనరుడు। విరక్తిదెలియ స్వీయపరకీయ । భిన్నభావాంధకారమున । సరిగా స్వకీయకర్మమునన్ గో। సన కాయ పుర్వుచ్ఛందమున్ । [illegible]వెరుగక

చిక్కుబడక గృహమున । దృఢమోహపాశబద్ధుండై । వరకళత్ర పుత్ర
మిత్రబాంధవ । వశుడై తుదమూఢుడై చెడక । గురుసౌఖ్యంబులు
దుఃఖములట్టుల । గోరకవచ్చును గాన వృథా । సరిపుచ్చక ప్రయాస
మున నాయువు । జవ్వనమునన్ మేల్కొనుచున్ । బరమభాగవత
ధర్మంబులనను । సరించి జీవించువరకు శ్రీ హరిస్మరణ సేయుచానంద
మున । దరించవలె సంసారంబుక ॥

సీ॥ హరియన నెవడనియందు రేనియకేంకౌ

మ ఖ్యకారణమన్ని భూతములకు

ఆకాశమట్టుల సంకటనిండియు

దానెద్దియుఁగాక తనరుచుండు

కల్లనికృంబు గావించు నాకంచు

నున్నకు విలువను బన్నునట్లు

అకటికి వేరైనదడిమె శూన్యము దాని

నే మాయయని మన మెరుగవలయు

పెక్కులేల యెల్ల వేదాంతసారంబు

తేటతెల్లము గను తెలియబడక

ఎద్దికలదో యదియె యీశ్వరతత్వంబు

యెద్దిలేదో యదియె యీజగంబు॥

క॥ కలిమిగలవాని లేమిన్

గలవాడెటు లాశ్రయించి కలిమిదెలుపునో

తెలియుము లేని జగంబది

మొలయ సర్వేశు నొద్ద నున్నటుతోచుక॥

అఠాణా - త్రిశ్రగతి.

ప॥ హరివశమున లేని జగం। బదియున్నటుతోచు శ్రీ ॥హ॥

అ॥ పరమభాగవతులుకాక । భ్రష్టులైన వారికెల్ల ॥హ॥

చ॥ అరయంగ సర్వభూతద । యయు నిష్కాపట్యంబును । బరమేశ్వర
భక్తిలేక - భ్రమోపహతులగు వారికి ॥హ॥

౧ సరి స్వప్నజాగరములు సమములనుచు దెలియలేక ॥ అరయ
నిత్యానిత్యకారు । డైన విష్ణుగొల్వబోక । ధరనాశా భంగములగు ।

తరుణీ తను భోగములను । మరిగి చచ్చి పుట్టిమరల । హాయంబడు
నజ్ఞానులకు ॥హ॥

గీ॥ స్వప్నజాగ్రత్సుషుప్తుల సాక్షియైన
వాడె యాత్ముడసంగ శ్రీహరియనంగ
వానిమహిమనుదోచు నీలేనిజగము
గానవానిని ధ్యానింపగల్గు ముక్తి॥

మలయమారుతము - త్రిశ్రగతి.

ప॥ నిక్కపుభక్తికిలోబడు నీలవర్ణుడెన్న ॥
అ॥ తక్కిన వ్రతక్రతు నిష్ఠలజిక్కడోవదన్న ॥ని॥
చ॥ ఎక్కడివారలకైన మా రేపూలవారికైన । నెక్కువవారలకైనన్
దక్కువవారలకైనన్ ॥ని॥
౧ హరిమయము సమస్తజగం । బని సమదృష్టిన్ గొల్చి । అరయన్నఖిల
భూతకోటి । యందనయము దయసల్పి । సరిగాసత్యంబాడి । సాధు
లతో జట్టుకూడి । నిరతంబానందాశ్రుల । నరుండు పులకించి చేయు॥ని॥
మ॥ అనయంబున్ హరి కేశవా సకలకర్తా సర్వలోకేశ్వరా
వనజాక్షా పరమాత్మ భూతదయ గోపాలా కృష్ణ నారాయణా
ఘనసంసార పయోధిమ్మగ్నిన మముం గాపాడి విజ్ఞానమి
మ్మని నిష్కామత బ్రాణమున్నవరకు బ్రార్థించుడీ దేవునిన్॥

శ్రీరాగము - చతురశ్రగతి.

ప॥ హరిని భజింతమన్యంబుత్యజింతము । తరింత మీజన్మము । మి
త్రులారా ॥హ॥
అ॥ నిరతము శాంతము । గురువుగ నెంతము । భరింతము దీనుల ।
నజ్ఞానుల ॥హ॥
చ॥ అరిషడ్వర్గంబులను జయింత । మనవరతము సత్యంబె వచింతము ।
గురుతుగ విశ్వాసంబె స్మరింతము । మరిమరి సాధువుల ననుస
రింతము ॥హ॥

కడున్నీతోడి బాలకులకు మోహ। శుమంశాస బుట్టించి విష్ణునిబా
గడి కులాచారముల్ జెగ నునిన్ను। గడుదురాత్మజంపబుణ్యమగు॥వె॥

గీ॥ ఇట్లు ప్రళయరుద్రునేపున దనకెద్ది
దిక్కుయెద్ది బలమొ తెలుపుమంచు
జంపబూను తండ్రి సన్నిధిగ బ్రహ్లాదు
డనిరొ నిటుల జిరునవలగుచుండ॥

౨౩ భవప్రియ-చతురశ్రగతి.

ప॥ తెలియుమ మాతండ్రీ యెల్ల దిక్కులకు దిక్కైనవాడె నా దిక్కు ॥తె॥
అ॥ బలులకు దుబలులకు నీకు। బలమెవ్వండో జగతికి వాడే బలము నాకు॥ తె॥
చ॥ చెలగువాడు కాలరూపంబున। గలవిశేషములగుణాశ్రయుం డై। మెలగు నావిభుడు జగములు తానై। మించులీల సృష్ట్యాది క్రియల॥ తె॥
౧ సరిగావిత్తంబు సేయుచు। మరిచిత్తంబు కంబెవ్వరి జగమందుగలడె పరువడి లోకములెల్ల జయించిన। ప్రభుడవింద్రియంబుల నోర్చలేవు అరిషడ్వర్గంబుల దెగనోసి। హరిభక్తుడవై ముక్తిగోనుము॥ తె॥

గీ॥ అనుచు హరిభక్తి మగ్నుడై యఖిలభూతి
సమత బరిగెడు ప్రహ్లాదు శాంతవాదు
సాధుసమ్మోదు నిఃఖేదు జంపదలచి
హేమకశిపుడత్యుగ్రుడై యిట్లనియె॥

సువర్ణాంగి-చతురశ్రగతి.

ప॥ ఘోరదుర్మతి చంపినజచ్చెద। నని తెంపుచేసెదేల ఘో॥
అ॥ ఈ లేదు జగములకు। నీనొండనేనైతి। లేరెందునాకన్న। శూరు లెవ్వా॥ ఘోర॥
చ॥ వీరుండగు నాతమ్ముని జంపిన। కారణమున జగమెంతయు వెదకితి। నేరూపున నెటనుండెవాడు నీ। నారాయణునితో నిన్ను గూల్తు॥ ఘో॥

క॥ అనిధిక్కరించు తండ్రికి
ఘనభూత సముండు మోక్షకాంతా ప్రియుఁడున్
వనజాక్షు భక్తచంద్రుం
డనినిటు ప్రహ్లాదుడంచితా మోదమునన్॥

౨౫ నామనారాయణి-రూపకము.

ప॥ వెదకనేల నాతండ్రి । విష్ణుఁడు లేని స్థలమేది ॥వె॥
అ॥ పదపడి భూమినభః । పాతాళములందున॥ వె॥
చ॥ జలధిన్ గాలిన్ దిశలన్ । వెలుగున్ రేలన్ బవళ్ళ । నలరుస్నీలో నాలో । నఖిలజగన్మయుఁడాహరి॥ వె॥

మంజరి-చతురశ్రగతి.

౧ అనుప్రహ్లాదుని ధిక్కరించి యక్కనకకశిపుఁడాలోన
చెనటీహరియెందున లేడనునే । జెప్పుగ వినవటుగాన।
౨ అగుపడక గలవె చక్రింగిక్కిన్హరి నీ స్తంభమునందు
అగణితముగ నటుజూపవేని । నీప్రాణంబుల నేగొందు।
౩ అనబాలుఁడు బ్రహ్మమొదలు తృణప । ర్యంతము నిండిన శౌరి
కనబడుట నీకుచోద్యమె యీపెను । కంబమందున మురారి।
౪ తప్పక కండనేడు చూడనగు బ । త్యక్షత నాహరి మనకు
విప్పుగననరచేతంగంబమును । బ్రేయు హేమకశిపునకు॥

సారంగ - రూపకము.

ప॥ నరకేసరియైపొడమె । నారాయణుడాకంబమున॥ న॥
అ॥ చరాచరేశుండు ప్రళయ । చండమార్తాండు వగిది॥ న॥
చ॥ సురలు పూలుకురియ న । చ్చరలు నాట్యమాడగిం
కరుడై ప్రహ్లాదుగావ । గనక కశిపుజంపిపోవ॥ న॥
సీ॥ గంభీర భీకర గర్జారవంబున
బ్రహ్మాండ భాండ కర్పరముపగుల
చటులసటాచ్ఛటాచలన సంజాత
ప్రచండవాతాహతిన్ గొండలెగయ

కాలానలాభీలకీలాభజిహ్వా ప్ర
భావళిఁ జగమెల్ల జేవురింప
తరుణేందు భాసుర దంష్ట్రినఖచ్ఛాయ
లలమిదిక్కులకు వెన్నెలలుగాయ
కరములురమును శిరముసింగంబుమాడ్కి
నాభికిఁ గ్రిందిభాగము నరునిపోల్కి
నలర నరసింహ రూపుననవతరించె
నాశ్రితపరాయణుండు నారాయణుండు॥

గీ. అటుల నరసింహమూర్తియై యవతరించి
తనసుతుని గరుణ దను రౌద్రమ్ముతోడ
గనుచునుండిన హరికినిట్లనియె దేవ
తారి యద్భుత వీరభయానకము గ॥

౨౬ మేచకల్యాణి - ఖండగతి

ప॥ హాయిదిగో నాగద । కైతివిప్పుడు విందు॥ హా॥
నాయనుజనింబంది । వైయడంచినదొంగ ॥హా॥
అ॥ మాయివై నాసుతుని । మాటనిలపెట్టుటకు నాయెదుట బడితివా
నారాయణా॥ హా॥
చ॥ ఈయాకృతితోన । న్నే బెదరించెదవా । నీయుబ్బడగించెద
నేబారకనిల్వుము ॥ హా॥

మంజరి - శ్రీరాగము.

౧ అని కనక కశిపుడాగ్రహంబునన్ । ఘనగదతో బిట్టేయన్
తృణీకరించుచు మనుజసింహంబు దెబ్బునవానిన్ డాయన్
౨ జేరిగరుడుండు సర్పముంబట్టు । చెలువున లోకువజేసి
యూరువుందిసి వానిగుండియల్ । జీర్ణ్రేవులందీసి
౩ తన కంఠహారముల గావించి । తక్కుడై తేయసేనఁ
ఘనచక్ర విహారమున బరిమార్చి । గద్దియపై సభలో[illegible]

౪ రౌద్రంబుగ గూర్చున్న నరహరిన్ । ప్రసన్ను సేయగలేక
రుద్రాద్యమరులు లక్ష్మియు శంకా - రుద్ధులైయుండవీక॥

సీ॥ అజుడు ప్రహ్లాదునకనెనట్టు లోదయ్యా
చూచితే యీయెల్లసురలకైన
నలరమా దేవికినైన భయంకరుడై
రౌద్రముగను నాకాయనుండు
తేరిచూడగరాక తీక్ష్ణదృష్టింగొన్న
వాడుగావున నీవుభక్తిమెరయ
శాంతుని గావింప జనుము బాలుడు
న్సంతోషమున హరిచెంత జేరి
వందనము సేయు నరహరి వాని నపుడు
చల్లగాజూచి యభయహస్తమున నిమురు
తనువుపులకించి గద్గదికను జెలంగి
హరినుతించె నతండు మోదాశ్రులెసగ॥

౨౮ గమకక్రియ - రూపకము.

ప॥ దేవసంశ్రితావనా । శ్రీపుపతిత పావన ॥ దే॥
అ॥ కేవలసత్యానందన । యూ విబుధజన గేయ ॥ దే॥
చ॥ నీవేసగుణుండవుమరి నీవేనిగుణుండవుర
నీవన్నియుగా వాదువు । నీతత్వంబెరుగదరమె॥ దే॥
౧ నినునుతింపలేక యిపుడు నిఖిల దివిజులూరకుంట గనియుజుక్క లంగడింప
కడగుపిల్లకాయబోలి పనిగసి నేబూనుకొంటి । బరకంతయు సిగ్గులేక
ననునేటు గున్నింతువా యు । నాథనాథపరమాత్మ॥ దే॥

దండకము.

జయజయ సర్వజ్ఞ సర్వేశ సర్వాంతరాత్మా జగత్సృష్టిసంస్థాపనో త్పాటనాదిక్రియాలోల విశ్వప్రధానా సదాసాక్షిభూతా నిరాకారకూటస్థవిశ్వస్వరూపా తురీయా యవేద్యా ప్రభూ సచ్చిదానంద తేజో

దుర్భాషలాలించు కర్ణంబులు నీకథాజాలమాలించ విస్తరుగా నింద్రియా బద్ధుడై తుచ్ఛసౌఖ్యంబులన్ బొర్లుచు నిన్ను సేవింపగాలేని మూఢాత్ము లంజూచి శోకింతునే బ్రాజ్ఞులౌవారు నిన్నాత్మలో దారువందగ్నిచందంబు గాగందురో యీశ నీభక్తి నాకెప్పుడుం గల్గజేయుంగదే కృష్ణ నారాయణా వాసుదేవా ముకుందా నమస్తే నమస్తే నమస్తే నమః.

క॥ అని వినుతిసేయు ప్రహ్లా
దునిభక్తికి సంతసించి తోయజనయనుం
డనఘా యిచ్చెద నీకో
ర్కెను దెలుపుమన నిటుల త్తరి న్బాలుడనెన్.

కేదార - రూపకము.

ప॥ నను శోధించగ నేర । నారాయణ జగదీశ్వర॥
అ॥ నిను గోరికలెల్ల మాని నేగొల్చుట నీవెరిగియు॥ న॥
చ॥ ఘనసంసృతి బీజంబౌ । కామము బహుదుఃఖాకర । మును నీభక్తి కడ్డనుచు మోక్షాసక్తి నొందిన॥ న॥
౧ ఎలమి నసించు నిహవిభవ । ములదెల్చు భృత్యజనము । గొలువ వారి కిడుదురు । కోర్కెలు కార్యపరులు ప్రభువులు భళి నాకుం గోర్కెలేదు । ప్రయోజనము నీకు లేదు । పొలపుగ గాను మువృద్ధిం । బొందని వరముదయసేయుమా॥ న॥

వ॥ అనిమనివి సేయు ప్రహ్లా । దుని విజ్ఞానమునకు బరితోషంబై యిట్లనియె న్నంశ్రిత హరి । చందనుడౌ నారాయణుండు దయచిప్పరెత్తన్॥

హిందూస్తాని భైరవి—చతురశ్రగతి.

ప॥ మేలు మేలు నిన్నోపలిన । మేటివిజ్ఞాని కలడె । చాలసంతసించినాను । బాలుడ ప్రహ్లాద ।
అ॥ ఏడుమింక నాభక్తుల । కెల్లనిదర్శనమైతివి । హాళిమీరగా వెలసిన యన్నియేండ్లు నీరాజ్యము॥ మే॥

౧ మరియు సీతంఁడి నాదేహ । మర్శనముసబుణ్యాలోక।మరిగినాడు చింత
దకిడి-హాయిగానుండు మీామీాద । కరము నిహంబనుభవించి । కడపట
నాచెంగట నీవరయగ నీబాలరూపముంది । స్థిరంబుగ నుందువు॥ మే॥

ద్వి॥ అని వరంబులనిచ్చి హరియేగెనంత
వనజాసనుడు వచ్చి ప్రహ్లాదునకును
బట్టాభిషేకంబు బాగుగా జేసి
నెట్టన సురలతో నెలవులజేరె
ఘనభక్తి ప్రహ్లాదుకథ విన్నవార
లనఘులై శాశ్వతాహ్లాద మందెదరు
హరిభక్తి వృద్ధికియ్యది రచించితిని
ధరను నారాయణ దాసుఁడ న్నేను ॥

క॥ సకల జగద్బంధుండ ది
నకరా సత్య స్వరూప నళినప్రియుడా
ప్రకటారోగ్య కరుడనే
వకజన మందార యరసవల్లీసూరా॥

తోటకము॥ కరుణాకర సంశ్రిత కష్టహరా
అరిభీకర సత్యవిహార వరా
సురవంద్య చరాచర సూత్రధరా
స్థిర మోక్షసుఖంకర తీక్ష్ణకరా॥

సురట—ఖండగతి

ప॥ మంగళము సూర్య జయమంగళ మవార్య॥
అ॥ మంగళము నీకుసురమాని తౌదార్య॥
చ॥ సంగీతవిలోల । సకలజగత్పాలా । సంగతబుతవత్మా । శాశ్వత
పరమాత్మా॥ మ॥

౧ భూరిలోకదీపత్రిమూర్తిస్వరూప । ఘోరభవతాపమణిమం
డలకలాపా । సారారసవల్లి సంప్రాత నివాసా । నారాయణదా
సానంద కరవిలాసా॥ మ॥

— * సంపూర్ణము * —

